గ్రంథమండలి:

# తీరని రుణం
(నాటిక)

## వడ్లమూడి గోపాలకృష్ణయ్య



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ఒక మాట

పిల్లల నాటకాలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయి. ఇది పిల్లల నాటకమయినా మన సంఘంలోనున్న తీవ్రసమస్యను ఎదుర్కొంటున్నది. హిందూసంఘ పతనానికి కులతత్వం మూలకారణం. కులాలు ఎందుకని సృజింపబడ్డాయి అనే ప్రశ్న ప్రస్తుతం అనవసరం. ఆ రోజుల్లో ఎలాఉన్నా ఈ రోజుల్లో అవి సంఘనాశనానికి దారితీస్తున్నాయి. ఆశ్చర్యమేమంటే గాంధి మహాత్ములు స్వరాజ్యం తీసికొచ్చి పెట్టినా అందరు వారికి ప్రతిగ్రామంలో విగ్రహాలు చేయించినా, వారు చెప్పిన అస్పృశ్యతా నివారణను ఆచరణలో పెట్టలేక పోతున్నారు. కులతత్వాన్ని నిర్మూలించ లేకపోతున్నారు. కుల తత్వం మన స్మృతికాలంలో ఎంత ప్రబలంగాఉందో ఇప్పుడూ అంతే ప్రబలంగాలేదా అని నాకు తరచు సందేహం కలుగుతుంటుంది. అక్కడక్కడా, వర్ణాంతర వివాహాలు, దేశాంతర, మతాంతర వివాహాలు, జరిగితే చాల్తుందా? జన సామాన్యంలో మార్పు రాలేదు. అస్పృశ్యత చట్టవిరుద్ధమయినా ఎంతవరకు పూర్తిగా అమలు జరగుతున్నది. మానవుల హృదయపరిణామం జరగాలి. ఇట్టి మహత్తరకృషికి ఇలాంటి సమాజ వికాస నాటకాలు ఎంతో తోడ్పడతాయి. అందులో పిల్లల అమాయిక హృదయాల్ని మాలిన్యంచేసే

సంఘ దురాచారాల్ని మార్చే ఇట్టి నాటకవస్తువు ఉత్తమ మయినదని వేరే చెప్పనక్కరలేదు.

భాషాసామరస్యము, పాత్రౌచిత్యం, గ్రామసీమల సహజ సౌందర్యము, పల్లెలలోని బడిపిల్లలు, పశువులకాపర్లు, పూర్వాచార పరాయణుల మూఢతత్వం చాల హృద్యముగా చిత్రించబడ్డాయి. నవీనకాల సుమతీ శతక మగు, నార్లవారి మాట పిల్లల కెంత ఉపయోగకరమో ? ప్రస్తుతపరిస్థితుల నెట్లు ఈ పద్యములు అతిచమత్కృతితో చిత్రించుచున్నవో ఈ నాటకములో చూపబడినది.

పల్లెటూరి నిరక్షరాస్యుల భాష చక్కగా చూపబడినది. ఇట్టి ప్రయత్నము జయప్రదమగుట కష్టము. ఆ భాషలో మనభాష మిళితమౌతుంటుంది. కాని శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వాఙ్మయాధ్యక్షులు, భాషా రహస్యముల నెరిగినవారు గాన పూర్తి పల్లెటూరి భాషను సహజ సౌందర్యముతో చిత్రించారు. ఇట్టి నాటకములద్వారా పిల్లలకే గాక పెద్దలకుకూడ హృదయపరిణామము కలుగగలదు.

ఈ నాటకం సంజీవయ్యగారికి అంకితమిచ్చుట చాల మంచిది. ఈయన ఉత్తమవ్యక్తి. మన రాజకీయరంగములో ఆదర్శప్రాయుడు. కవి, సహృదయుడు, అందరి ప్రేమను చూరగొన్నవాడు.

ఇట్లు
ర ం గ య్యా ప్పా రా వు



దేశసేవాధురంధరదీప్త సుగతి
సంస్కృతాంధ్ర సాహిత్య ప్రశస్తుడితడు

దేశసేవాధురంధరదీప్త సుగతి
సంస్కృతాంధ్ర సాహిత్య ప్రశస్తుడితడు

# సహాలుపోగు

యుగయుగాలుగా మానవప్రగతి గోరి
ధారగాఁ బోసి శక్తి ప్రత్యణువుగూడ
క్షణము క్షణమును తీరని (ఋ) రుణము విడిన
వజ్ర జాతి బుట్టిన మేలివజ్రమెవడు !

భావుకుండై సుస్వభావోన్న తాత్ముడై
చిరునవ్వు లొలయించి చెలఁగు నెవఁడు !
సంజీవమిత్రుడై సంజీవి తానైయై
తమ్ములన్ తండ్రులన్ తనుపు నెవడు !
దామోదరుండై సదామోదలోలుడై
సంక్షేమ సంఘాల సాకు నెవడు !
కర్మతత్త్వజ్ఞుడై ధర్మమర్మజ్ఞుడై
కార్మికాళిని జూచి కాచు నెవడు !

హరిజనుల గిరిజనులను నరుల నొరుల
కరుణ నరసెడి హరిజనవరు డెవండు !
అట్టి సుకృతికి దామోదరాన్వయునకు
ఆప్తునకును సంజీవయ్య ఆఖ్యునకును.

నోరులేని మాలల మహమ్మారియైన
అంటరానితనమది అన్యాయమనుచు
" తీరని (ఋ) రుణ " మ్మనబరగి తీర్పుతీర్చి
ఒప్పు నాటిక నంకిత మొనగుచుంటి.

లేనివాడని అనలేములే మనసార
కాదన్నవాడనన్ రాదు నోరదియేమొ
లేకయు నున్నట్టి లోకనాథు డితండు
ఉండియున్ లేనట్టి నిండుపేద యితండు.

ఇటువంటి నిరుపేద ఇటువంటి ధనికుండు
విటలాక్షు డొక్కడే నికటమ్మ్రనముదోచు
చక్కని కృతిని యీ సంజీవయ కొసంగి
సంతృప్తి పడుదు నా శంకరు కిడినట్లు

వేలువేలు తరాలు నరాలు క్రుంగ
వెన్నపూసను బోలుచు వెన్నపూస
లెన్నికోట్లుకోట్లు కరగియిగిరెనొగద!
స్వార్థపరమైన ఒక్కదుర్జాతికతన.

కర్మయోగి శ్రీగాంధిజీ కారణముగ
జ్ఞాననేత్రమున్ దెరచి యీనాటికైన
గుడ్డిలోమెల్లగానైన గుణ మెరింగి
మసలుచున్నాములే బుద్ధిమంతులమయి.

అగ్రవర్ణాల కామడ అవలనిలిచి
తీరని (బు) రుణాన ముంచు జాతీయు కిడుదు
ప్రకటనామసామ్యాన "తీరని (బు) రుణమ్ము"
చంద్రునకు నూలుపోగన్న చందముగాను.

# తీ ర ని రు ణా ం

## 1 రంగం

[బడి అప్పుడే వదిలిపెట్టారు. పలకలు పుస్తకాలు పట్టి రామం, గోపాలం, సుందరం. జగదీశ్, రాజేశ్వర్రావులు వస్తుంటారు.]

గోపాలం: (జగదీశ్‌తో) ఒరేయ్! సుమతీశతకం పద్యం అప్ప చెప్పడంలో ఫస్టుమార్కు నాదేరోయ్! ఒక్కతప్పైనారాలేదు.

సుందరం: (గోపాలంవైపు వారగా చూస్తూ) నాదైనా ఒక్క తప్పేగామ్మా! అదైనా మాష్టారు కోపంగా వుండబట్టి భయమేసి.........

రామం: ఓశ్!....సుమతీశతకం నేను క్రిందటేడే చదివేశాను. ఇయ్యేడు మాకు నార్లవారిమాట పద్యాలు పెట్టారు.

జగదీశ్: భలేపద్యాల్లే! మా అక్కాయి రోజూ అయ్యే చదువుతూ వుంటుంది.

రాజేశ్వర్రావు: నాకదేంటో! అవి చదువుతుంటే ఇంకోపాఠం అసలు చదవబుద్దే పుట్టదురా!

[బడిపిల్లల కెదురుగా గొడ్లకాడాళ్ల ప్రవేశం. చేతుల్లో కర్రల్తో మల్లిగాడు, వెంకడు, పిచ్చాడు, ఏసు, భీమడు.]

వెంక: (యెదుటికి చూస్తూ బిగ్గరగా) ఉరేయ్! వుల్లిగా! నాగొడ్డనుకూడా దొంకకు మల్లెయ్‌రోయ్!

పిచ్చా: (యెదుటికి చూస్తూ బిగ్గరగా) అటే నాయిగూడా మల్లేశిరారా! నిన్న నీయెల్లావుని మల్లెయ్యలా ?

గోపా: (చేతుల్తో తాళం వేస్తూ)
గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడు ?
గొడ్డన్ని చేలోను పడ్డప్పుడు.

వెంక: ఉరేయ్! ఏసు! గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడంటరోయ్! (యెదుటికి చూచి) సూశావంటరా బీవ(డూ! మీసిన్నదొరపని యెట్టావుందో!

భీమడు: (గొడ్డకాడాళ్లకు యెదురుగా కఱ్ఱ బుజానపెట్టుకొని ప్రవేశిస్తూ) వుంట దుంటది. నిన్నగాక మొన్నేరా కొత్తపలక పలగ్గొట్టాడని మా అన్నపూర్ణమ్మగోరు కొడితే తాటరేగి పోయింది. నీళ్లోత్తంటే యెఱ్ఱగా కంది యీపిమీన అంటినేళ్లు అంటినట్టే వున్నయ్యనుకో!

వెంక: మాబాగా యాశిందన్నమాట. యేరా బీవా(! మాదున్న దూడ తిన్నగా మందలోనే వుందా ?

భీమ: అన్నీ వుండయ్ లేవుశె!

గోపా: ఒరేయ్! రామం! సుందరం! యీళ్లపని పహోయిదిగా వుందిరా! అందరం పాడదాం పట్టండి.

గోపా: (గంతులు, చేతుల్తో తాళాం వేస్తూ) గొడ్డకాడి బుడ్డాడి (మధ్యలో రామం కూడా అందుకుని) పెళ్లెప్పుడు ?

సుం. జగ. రాజే: (గంతులు, తాళాం వేస్తూ) గొడ్లన్ని చేలోను పడ్డప్పుడు. (ఈచరణమే పదేపదే అంటూ వుంటారు)

భీమ : ఓరేయ్ యెంకా ! పుల్లిగా ! ఏసు ! పిచ్చాడా ! అందరూ పాడండిరా ! మనం పాడలేవా! యేం ? గొడ్డకాడి బుడ్డాడి (మధ్యలో ఏసుకూడా అందుకుని) పెళ్లెప్పుడా ??

వెం మల్లి. పిచ్చా. పుల్లి : గొడ్డన్ని పిక్కబలిసి వున్నప్పుడు.

బడిపిల్లలు : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడు ?
గొడ్లన్ని దారి తప్పిపోయినప్పుడు.

గొడ్డకాడాళ్లు : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడా ?
గవిడిగీదపెయ్య దూడనేసి నప్పుడు.

బ. పి : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడు ?
తాడుతప్పి దూడ పాలుకుడిచినప్పుడు.

గొడ్డ : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడా ??
యెల్లావు కోడెదూడ నేసినప్పుడు.

బ, పి : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడు ??
గేదె వీపుమీద వాత తేలినప్పుడు.

గొడ్డ : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడా ??
పెద్దనౌకరు నెలవు పుచ్చుకొన్నప్పుడు.

బ. పి : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడు ?
గాడికాడి పేడకళ్లు తియ్యనప్పుడు.

గొడ్డ : గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడా ??
పున్నెదినం యేరువాక పున్నమప్పుడు.

(చివరి చరణం పూర్తయ్యేలోగా ప్రవేశం కృష్ణ. చేతిలో పుస్తకా లుంటాయి.)

కృష్ణ: ఒరేయ్ ! సుందరం ! గోపాలం వాళ్లకైనా బుద్ధిలేకపోతే నీకైనా లేదంట్రా ? బజార్లో గొడ్డకాడాళ్లను పట్టుకుని యేవిటిరా యిదంతా ? (గొడ్డకాడాళ్ల వైపు చూచి) మీకేం పని లేదంటరా ! మీగొడ్లన్నీనేమో ముందు, మీరిక్కడానా ? చదుకునే పిల్లల్తో మీకెందుకు ? ఫొండి. ఒరేయ్ సుందరం ! గోపాలం ! రండిరా మనం పోదాం.

(బడిపిల్లలు రెండడుగులు వేస్తారు. గొడ్డకాడాళ్లు నాలుగడుగులు వేసి)

పుల్లి : ఆకుట్నయ్యగోరు మామంచోర్రా ! సిలిపితనమంటే యేవిఁటో యెరగడు.

ఏసు : మాదొరసానిగోరు బంగారం రా ! తల్లినిబట్టే కొడుకు ! యేరే శెప్పాలా ? ఉరేయ్ యియ్యాల కోటిగాడు ముందెల్లినట్టుండాడు.

పిచ్చా, వెంక : పోదాం రండిరా ! గొడ్డప్పుడే బుల్లియ్యగారి శేను దాటిన ట్టుండాయ్. (గొడ్డకాడాళ్లంతా వెళ్లిపోతారు.)

రాజే : ఒరేయ్ కృష్ణ ! గోపాలం ! మధ్యాహ్నం అన్నం తిన్నాక మనం అందరం ముంజికాయలకెల్దాం రా ! యేరా సుందరం ! యేమంటావ్ ?

రామం. జగ : వెళ్దాం రా తప్పకుండా.

జగ : అల్లాడారి తోట్లోకి వెళ్దామా బొబ్బారి తాళల్లో కెల్దాం రా ?

రాజే : కాదురా ! తోటగుంటమీద కెల్దాం రా ! మాపాలేరక్కడే వుంటాడా ! వాడే కోసిపెడ్తాడు,

అందరు : (గోపాలం తప్ప) అవునవును తోటగుంటకే వెళ్దాం.

కృష్ణ : అందరూ మాట్లాడుతున్నా నువ్వు పల్లెత్తైనా మాట్లాడ్డం లేదేరోయ్ గోపాలం ! నువురావా యేం ?

గోపా : మమ్మకు చెప్తే యీాయేసాకాలంలో వడకొడుతుందని వద్దంటుందిరా ! యిల్లు కదల్నివ్వదు.

రామం : (నెమ్మదిగా) అన్నం తినేసి లెక్కలు చేసుకోవాలని చెప్పి పుస్తకాలు పట్టుకుని మాయింటి కొచ్చెయ్‌రా గోపాలం !

గోపా : వస్తే ?

రామం : (నెమ్మదిగా) పుస్తకాలు మాయింట్లో పెట్టి గప్‌చిప్‌గా ముంజికాయల కెళ్దాం. (అందరివైపు చూచి) మీరంతా అన్నం తిని ఒంటిగంటకల్లా ఒచ్చెయ్యండిరా ! అందరం కలిసెళ్దాం.

అందరు : సరే అట్లాగే వస్తాం. వెళ్దాం. (అందరూ వెళ్తాడు.)

తెర పడుతుంది

# తృ తీ య రం గం

## 2 రంగం

[తెర లేస్తుంది. వెంకడు తుండుగుడ్డ తలక్రింద పెట్టు
కని వెల్లకిలా పడుకుని వుంటాడు. మల్లిగాడు ఏసు,
భీమడు, పుల్లాయ్, పిచ్చాడు కూర్చొని వుంటారు.]

ఏసు : (మొహాన చెయ్యి అడ్డం పెట్టుకుని చూస్తూ) యెవర్రోయ్ ఆ వత్తుండారు ?

పుల్లా : అవునురా ! అడుగో మీశిన్నదొర కుట్నయ్యగోరు.... యింకా.....శివయ్యగోరి మూడోకొడుకు.....యింకా నలుగు రైదుగురుండార్రా !

వెంక ; (లేచి కూర్చొని మొహం చిట్లించి చూస్తూ) కుట్నయ్య గోరు, రామంబాబు, గోపాలంబాబు, సుందరంబాబు.....ఆ..... మరి ..... జగదీసుగోరు .....యింకా ..... రాజేశ్వర్రావియ్యగోరు (ప్రక్కకుచూచి) యేరోయ్ కోటిగా ! మీ శిన్నదొరొత్తుం డాడురోయ్ ! ముంజికాయిల కనుకుంటా. సువ్వేక్కాక తప్పదులే.

కోటి : (ప్రవేశించి) నిజంగా నంటరా ! (చెయ్యి అడ్డంపెట్టి చూచి) నిజమేరోయ్ ! మొన్నెప్పుడోరమ్మంటే యియ్యేడు పొలం మీనకిరాను యింటికి తేవాల్సిందే నన్నాడు. యెంతు కనో యియ్యాల పొలం మీనకే బైల్దేరాడు.

ఏసు : పోనీలేరా ! ఆ దొరపేరుమీన మేంకూడా నాలు క్కాయిలు తింటాం.

పుల్లా : నీ గొడ్డన్నేను మల్లేత్తాలేరా కోటీ! నాకు నాలుక్కాయిలియ్యి.

వెంక : నేను పోగేత్తానురా కాయలన్నీ యేరి.

ఏసు : నేనూ పోగేత్తా!

భీమ : పిచ్చాడు నేను కోసిత్తాంరా కోటీ!

వెంక : పిచ్చాడు నువ్వు యిద్దరూ కోసియ్యడాని కుంది కోటి తెచ్చిందొక కత్తేగదరా!

కోటి : మారాజేశ్వర్రావియ్యగో రెప్పుడు బయల్దేరినా కత్తి లేకుండా బైల్దేరడు మూడేళ్లనుంచి సూత్తుండాగా.

భీమ : వత్తుండారుగా.....అదుగో ఆదొర మొల్లో వున్నట్టేవుంది. యేదోయెత్తుగా కనపడతాంది.

వెంక : ఔన్రా! - కత్తుంది.

కోటి : నేశెప్పలా! ఆయనెప్పుడూ కత్తిలేకుండా పొలం బయల్దేరడని.

వెంక : ఉరేయ్ కోటీ! పొద్దున్న మేంగిద ల్నిప్పేయాలకి యీ బాబులు బడొదిలిపెట్టార్రా! బీవఁడు శిన్నదొరుండాడే గోపాలంబాబు.....

భీమ : (మధ్యలో అందుకొని) మాశిన్నదొరైతే యెక్కువేరా; నేనేశెప్తాను. గొడ్డకాడి బుడ్డాడి పెళ్ళెప్పుడని చ్నెయితుల్ని కలుపుకుని అదేపనిగా అల్లరి శేశాడురా!

పిచ్చా : యెందుకుశె! యిప్పుడు రానియ్యండిరా! యీాళ్లపని శెద్దాం.

మల్లి : మనంకూడా పాటకట్టి పాడదాంరా !

పుల్లా : ఆ కుట్నయ్యగోరుకూడా వత్తుండా డనుకున్నాం. ఆ దొర కనపడ్డేంరా యేసు !

ఏసు : యెనకపడ్డాడేవోంలే ! ఆయనే వత్తాడు. మారాజు !

వెంక : యెనకపల్లేదురా యెద్దకోడు పొదసాటున కాలు మడుసు కుంటున్నాడు. (కోటివైపు చూచి) కుట్నయ్యగోరు మామం చోంరా కోటి ! గొడ్డకాడి బుడ్డాడి పెళ్లెప్పుడని ఆళ్లంతా యెద్దేవగా పాడతంటే యీయనొచ్చి అదేంపనని కేకలేశి ,లాక్కుపోయాడురా ?

పుల్లా : ఆళ్ల పాడితే మనంమాత్రం వూరుకున్నావేంరా !

మల్లి : ఆళ్లన్నాటికి సమాదానం యిచ్చామేగాని ఆళ్లనే మ్మనం అడిచ్చలేదుగా ! మన్నే ఆళ్లాడిచ్చారుగాని.

కోటి : అయితే మల్లి ! యిప్పుడు మనం ఆడిచ్చాలంటావ్ !

మల్లి : కుట్నయ్యగోర్ని కాదురా. గోపాలంబాబాళ్ళందర్ని.

(ప్రవేశం. రాజేశ్వర్రావు, రామం, గోపాలం, సుందరం, జగదీశ్.)

రాజే : ఏంరా కోటి ! తయారైన ముంజికాయలేమైనా వుండ య్యంటరా ?

కోటి : కాయలకేంగాని బళ్లో పొస్తకాలు పెట్టి యీళ్లనందర్ని యిటుతోలుకొచ్చారేంటి బాబు ?

రాజే : బడిలేదురా ! యింకా నీకు తెలవదా ?

రామం : మొన్న సోమవారం నుంచి ఒంటిపూట సెలవులురా !

మల్లి : (గోపాలంవైపు చూచి చేతుల్తో తాళంవేస్తూ)
అల్లారుముద్దుదొర (పుల్లాయ్‌కూడా మధ్యలో అందుకొని)
పెళ్లెప్పుడు ?
పిల్లల్తో పోట్లాడి కుళ్లినప్పుడు (ఈ చరణమే పదేపదే అంటూ వుంటారు)

రామం : మనంకూడా పాడదాం పట్టండిరా ! పొలం వచ్చామని వీళ్లపని మహోయిదిగావుంది.

మల్లి - పుల్లా : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడు ?

వెంక. పిచ్చా
ఏసు. భీమ.
కోటి
: పిల్లల్తో పోట్లాడి కుళ్లినప్పుడు.

రామం : (గంతులు తాళాంవేస్తూ) అల్లారు ముద్దుదొర (మధ్యలో గోపాలం కూడా అందుకొని) పెళ్లెప్పుడా ? ?

సుంద. జగ.
రాజే
: అదేపనిగ అమ్మ ముద్దులాడినప్పుడు

గొడ్డకాడాళ్లు : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడు ?
అమ్మయిచ్చిన అణాకాసు పోయినప్పుడు.

బడిపిల్లలు : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడా ? ?
ఆటలాడి పాటలెన్నో పాడినప్పుడు.

గొడ్డ : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడు ?
కొత్తబట్టలు దుమ్ము కొట్టుకొన్నప్పుడు.

బ. పి : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడా ? ?
కళ్లకప్పు కల్లకపట మెరుగనప్పుడు.

గొడ్డ : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడు ?
పంతులయ్యకు పాట మప్పచెప్పనప్పుడు.

బ. పి : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడా ? ?
బళ్లోను ఫస్టుమార్కు వచ్చినప్పుడు.

గొడ్డ : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడు ?
నాన్నకొన్న కొత్తపలక పగిలినప్పుడు.

బ. పి : అల్లారు ముద్దుదొర పెళ్లెప్పుడా ? ?
ఒళ్లో ఒక లక్షవచ్చి ఒరిగినప్పుడు.
(చివరి చరణం పూర్తయ్యేలోగా ప్రవేశం కృష్ణ.)

కృష్ణ : యేమిటిరా కోటిగా ! అందరికంటె పెద్దావువు. వాళ్లకు చెప్పడంపోయి నువ్వుకూడా యేకమయ్యావన్న మాట ? (రాజేశ్వర్రావువైపు చూచి) యిందుకోసమేనా అందర్నీ తీసుకొచ్చావ్ ? ముంజికాయలుమాట పోయింది. పోట్లాటకు దిగారన్నమాట.

కోటి : కోప్పడకండి కుట్నయ్యగోరు ! పొద్దున్నయేదో గోపాలం బాబాళ్లంతా.....

కృష్ణ : పొద్దుంది పొద్దునే అయిపోయింది. మళ్లీ యిప్పు డెందుకు ?

రాజే : యిందులో పోట్లాడ్డం యేముందిలే కృష్ణా ! యేదో సరదాకి.....

పుల్లి : మాబాగా శెప్పారు.

కృష్ణ : సరే. పదవండి కాయలకెళ్దాం.

కోటి : ఒరేయ్! మల్లి! ఆ యేపశెట్టుమొదట్లో పైకండువా కింద కత్తుందితేరా! నల్లకాయిల తాడెక్కుతాను.

రాజే : వద్దులేరా! అది కిందించుదాం కొయ్యడానికి. నాదగ్గర బాగా పదునుగల కత్తుందిలే (చొక్కాక్రింద బొడ్లోవున్న కత్తి తీస్తాడు)

కోటి : (కత్తి తీసేలోపుగా) అదేంటండి రాజేశ్వర్రావియ్యగోరు కత్తి బొడ్లోపెట్టుకునే గంతులేశారు. తెగితే యింకేవన్నా వుందా?

రాజే : వుషార్లో మర్చిపోయానురా! ఆయినా నాకేం గుచ్చుకో లేదులే.

కోటి : ఒరేయ్! మల్లి! కింద కాయలు కొయ్యడానికైనా యింకో కత్తి కావాలిగా నాకత్తి తేరా! (మల్లిగాడు వెళ్తాడు)

రామం : నల్లకాయలుకంటే తెల్లకాయలు తియ్యగా వుంటయిరా?

కృష్ణ : యేవయితేనేం? బాగాఅయిన కాయలు కొట్టరాకోటి!

పిచ్చా : సుబ్బయ్యగారి తోపులో చిట్టికాయలేగాని తెల్లకాయలు మాబాగా ఐనయ్యండి కుట్నయ్యగోరు!

రాజే : అయితే సుబ్బయ్యగారి తోపులో కెళ్లి ముందు తెల్లకాయలు కొట్టుకొని తర్వాతే యిక్కడికి వద్దాంలే. పదండి పోదాం.

పుల్లి : కోటి! యేంకా! మీ అందరిగొడ్డు నేమల్లేత్తుంటా లెండిరా యెల్లి యిద్దరేవోం కాయిలుపోగేసి యిద్దరు కోసి పెట్టండిరా!

వెంక : కోటి! పిచ్చి! రండ్రా పోదారి.

పిచ్చా : యీటన్నిటినీ మల్లేత్తూ నీయెల్లావుని పోగొట్టుకునేవ్ రోయ్‌! జాగ్రత్తగాకాయి. దాని కసలు కాలు నిలవదు.

(అందరూ వెళ్తావుంటారు)

పుల్లి : ఒరేయ్‌! కోటి! ఏసు! నాకు రొండు తెల్లకాయిలు తెండిరోయ్‌! బీవఁడు! మర్శిపోబాకు!

కోటి : (వెనక్కి తిరిగి) నీకు తేకపోడమేంటిరా పుల్లాయ్‌! మా గిన్నికొమ్ములుగీదా గవిడిగీదా పొడుసుకుంటయ్ సూత్తా వుండరోయ్‌! (వెళ్లిపోతాడు.)

పుల్లి : నేనుండగా పొడుసుకోడవేఁ? (వెనక్కి చూచి) యెహేయ్‌! యెహేయ్‌! ఢిర్రా! ఢిర్రా! (అంటూ కర్ర తిప్పుకుంటూ పరిగెడ్తాడు.)

తెర పడుతుంది

# తీరని రుణం

## ౩ రంగం

[తెర లేస్తుంది. బడిపిల్లలు గొడ్డకాడాళ్లు అంతా ప్రవే శిస్తారు. వచ్చీ రావడంతోటే భీమడు వెంకడు వెల్లకిలా పడుకుంటారు. తక్కినవాళ్లు కూర్చుంటారు ]

జగ : భలేకాయలురా ! పొట్ట నిండిపోయింది !

రామం : ఆ నల్లకాయముంజి అంతలోతుందేరా !

గోపా : వంకతాడికాయలు చూడ్డానికి కొబ్బరి బొండాల్లాగా వుండయ్యేగాని వెధవముంజిలు చిన్నాల్చిప్పలంత.

కోటి : అయ్యొ శండకలకాయిలు బాబుగోరు ! ఆటినసలు కొట్ట గూడదు. రాజేశ్వర్రావియ్యగోరు కొట్టమన్నారని కొట్టాను గాని అయ్యసలు పళ్లకాయిలు గోపాలంబాబు !

కృష్ణ : తెల్లకాయలు ముంజి లెంతైతేనేంలే అమృతంలా గున్నాయి.

సుంద : నాకైతే కడుపునొప్పి వొచ్చేట్టేవుంది. (పొట్ట పట్టు కుంటాడు.)

రాజే : కానేపుండి యింటి కెళ్తాంగా దారిలో పుల్లమావిడికాయ కోసి తలా ఒకముక్కా తిందాంలేవు శె ! అవే అరిగి పోతాయి.

గజ : (హఠాత్తుగా యేదో గుర్తువచ్చినట్టు లేచి లాగూ జేబు తడిమి) అరె ! మర్చిపోయాను. నేను చింతపండు తెచ్చానురా ! (జేబులోంచి తీసి) ఇదిగో ! అందరూ తలా

కాస్తా తినండి. (కోటివైపు చూచి) మీరూ తలాకాస్తా తినండిరా! (సగం యివ్వబోతాడు.)

కోటి : (వారిస్తూ) మాకెందుకుబాబు! బండముండోళ్ళం! రాళ్లు తిన్నా అరుగుతయ్.

ఏసు : కిందఉడ్డైతే ఒకతేప కటికిముంజిలే తిన్నాం. మనకేం శేశినియ్యి?

పిచ్చా : కత్తితో తీసి నవుఁల్తుంటే గొబ్బరిముక్కలే అని పిచ్చినియ్!

జగ : అయితే చింతపండు వద్దంటారు? సరే! (తోటివాళ్లకు పంచిపెడతాడు తలాకాస్తా. అందరూ చప్పరిస్తూ వుంటారు.)

కోటి : ఉరేయ్! పిచ్చాడా! ఏసు! పుల్లాయ్! యెల్లండిరా! పొద్దెంతవాలిందో సూడండి! యేరోయ్‌బీవాఁ! లెగంట్రా! నిన్నుగాదురాయెంకా! అందరూలేసి గొడ్డనన్నింటిని శెర్లో దిగేసి కడగండిరా! సల్లగా యింటిదోవ పట్టిద్దాం.

రాజే : నిజమే! అందరూ లేచి కడగండిరా! సాయంత్రం కాబోతోంది. యిళ్లకుపోదాం.

మల్లి : ఉరేయ్! బీవాఁ! యెంకా! గొడ్డనన్నిటిని శెర్లోకి మళ్లెయ్యండిరా! నేనూవత్తాను కడుగుదాం.

(భీమడు, వెంకడు వెళ్తారు)

ఏసు : మల్లి! పుల్లిగాడి యెల్లావుని మా అవుదూడ్ని సూత్తుండరా! నీగొడ్డనికూడా మేంకడుగుతాం.

మల్లి : అట్టాగేలే!

కోటి : శెర్లోదిగినియ్‌రా! తొరగాకదగండి! లెగండ్రా! (అని కోటి తలకింద గుడ్డపెట్టుకొని పడుకుంటాడు.)

(పల్లిగాడు తప్ప తక్కినవాళ్లంతా ఒకవైపుకి వెళ్తారు.)

మల్లి : (పడుకోబోయి పక్కకు తిరిగిచూచి) యెహేయ్! నిన్ను మాదిగాడుదిన! ఛీగ్రా! ఛీగ్రా! (అంటూ కఱ్ఱ పుచ్చుకొని రెండోవైపు పరిగెత్తుతాడు.)

రామం : ఒరేయ్! గోపాలం! సుందరం! మనంకూడా స్నానం చేదామంటరా!

సుంద : యేరా! జగదీశ్! చేద్దామా! కృష్ణ చెయ్యడేమోలే!

కృష్ణ : మీరంతా చెయ్యండి. నేనుమాత్రం చెయ్యను.

సుంద : కృష్ణ చెయ్యడని నేను ముందే చెప్పాగా!

రాజే : అయితేయేంరా? నేనూవస్తాను పదండి మనం అందరం చేదాం.

రామం : ఒరేయ్‌రాజి! ఓలాడదాంరా?

కోటి : ఏవండోయ్! మీపున్నెముంటది. లోపలికెల్లకండి. మునిగిపోతే ముందు మాకు మాటొస్తది.

సుంద : గోపాలం! నీకు యీతొచ్చుగదరా! మసిద్దరం మునిగి యెవరెక్కువ దూరం వెళ్తారో పందెం వేసుకుందాం?

కోటి : అయ్యేం వొద్దుబాబు! వొడ్డునే శెయ్యండినామాటిని.

రాజే : సరే! లేవండిరా! చొక్కాలయ్యి యిడవండి.

(రామం, గోపాలం, సుందరం, జగదీశ్, రాజేశ్వరావులు. చొక్కాలు తీస్తూ వెళ్లిపోతారు.)

కృష్ణ : (బిగ్గరగా) మెల్లిగా రేవులోదిగి చెయ్యండిరా ! ఒరేయ్ సుందరం అలాదూకుతున్నావ్ యేరాయో తగిలితేనో ?

కోటి : (లేచికూర్చొని) యీ చెరువులో రాళ్లేవీఁ లేవులెండి. (పక్కకు చూస్తూ) గోపాలంబాబు యేవోఁ అనుకున్నాను. దిట్టంగా యీత్తున్నాడే ! (ఆశ్చర్యంగా చూస్తూ) అరె ! జగదీశ్ బాబు సిటుక్కులో యిక్కడ మునిగి అక్కడ తేలాడే !

కృష్ణ : రాజేశ్వర్రావుమాత్రం తక్కువ తిన్నాదేరా ? అవుగో వెల్లకిలా పడుకొని యెట్లా యీత్తున్నాడో !

కోటి : యీయనా అసాధ్యుడేనే చేతులుకూడా పైకెత్తి దణ్ణం పెడతన్నాడు. ఒక కాళ్లమీనే ఆదారపడి యీత్తం మాకట్టం కుట్నయ్యగోరు ! (అంటూ పడుకుంటాడు.)

కృష్ణ : (హడావుడిగా) అరరె ! ఆరె ! ! సుందరం మునిగి పోతున్నాడురోయ్ కోటి! పరిగెత్తు ! తొందరగా దూకి యీదికెళ్లరా ! కోటీ !

కోటి : (ఖంగారుగాలేచి) అంటూనేవుండా. మంచిపని శేశాడు. (అంటూ వెళ్తాడు కృష్ణకూడా వెనకాలే ఖంగారుగా వెళ్తాడు.)

[కొంత సేపటికి తడిపంచెతోవున్న కోటి తడిలాగుతో స్మృతి తప్పివున్న సుందరాన్ని బుజాన వేసు కొస్తాడు. వెనకాలే కృష్ణ వస్తాడు. గోపాలం వగైరా అంతా స్నానంచేసిన శరీరాలతో వస్తారు.]

కోటి : కుట్నయ్యగోరు ! ఆ పంచి పరువుబాబు దబ్బుని. (కృష్ణ గబగబా పంచె పరుస్తాడు.)

(కోటి ఆ పంచెమీద సుందరాన్ని పడుకోబెట్టి పొట్ట నొక్కు తాడు. సుందరం నీళ్లు కక్కుతాడు.)

జగ : అమ్మో ! యెన్నినీళ్లుతాగాడో !

రామం : నేచూస్తూనేవున్నా. కాస్సేపట్లో నాలుగ్గుటకలేశాడు.

కృష్ణ : సుందరం ! సుందరం ! ఒరేయ్ సుందరం ! పలకడం లేదేరాకోటి !

కోటి : నీళ్లు యెక్కువుగా తాగారేవోఁ స్మృతితప్పింది కుట్నయ్య గోరు ! (వెంకడు పుల్లాయిలవైపు చూచి) ఉరేయ్ పుల్లా ! యెంకా ! ఆ మీనకెళ్లి రొండు దోసిళ్లు యిసక తెండ్రా !

(వెంకడు, పుల్లాయ్, పిచ్చాడు వెళ్తారు.)

రామం : యిసుకెందుకురా కోటి !

కోటి : నీళ్లల్లోనానారా రామంబాబు ! యిసక రాత్తే నీరు పీల్చేత్తది. సలి తగ్గుద్ది. (మల్లిగాడివైపు చూచి) ఉరేయ్ మల్లి! నీతుండుగుడ్డివ్వరా యీ తడిపంచి యిడుత్తాను.

మల్లి: యిదుగో తీసుకోవుశె ! (తుండిస్తాడు.)

కోటి : (తుండు కట్టుకొని) యిదుగోరామల్లి యీతడిపంచి పిండి పట్టుకోరా ! (మల్లిగాడు పిండి పట్టుకుంటాడు.)

(వెంకడు, పుల్లాయ్, పిచ్చాడు తలొకదోసెడు యిసుక తెస్తారు. కోటిగాడు సుందరంలాగూ విప్పేసి ఒంటిమీద యిసుక పోస్తాడు.)

పిచ్చా: మాయేడిగావుందరా యిసక.

కోటి : యేడిగావుంటేనే మంచిదిరా ! సలి తగ్గిత్తది.

(సుందరం మూలుగుతూ ఒణుకుతూ కొద్దిగా కదులు-తాడు.)

కృష్ణ : బాగా చలివేస్తున్నదిరా ! ఒణుకుతున్నాడు.

కోటి : లాగూ సొక్కా పొడియ్యంటే తొడిగితే బాగుండు.

కృష్ణ : నేను తుండు కట్టుకుని నాలాగూ యివ్వనంట్రా !

కోటి : అడగాలాబాబు ! యివ్వండి !

[కృష్ణ తువ్వాలు కట్టుకుని లాగూ విడిచి కోటిగాడి కిస్తాడు. కోటిగాడు ఆలాగూ సుందరానికి తొడిగి సుందరానిదే చొక్కాకూడా తొడుగుతాడు. అయినా యింకా బాగావొణుకుతూ వుంటాడు సుందరం. తక్కినవాళ్లు వొళ్లు తుడుచుకొని వస్తారు.]

కోటి : ఒరేయ్ పుల్లాయ్ నాకండువా ఆయాపశెట్టు మొదట్లో వుంది యిట్టాతేరా కప్పుదాం. (పుల్లాయి వెళ్లి తెస్తాడు.)

పుల్లా : (కండువా అందిస్తూ) యింటికి తీసకెళ్తే డాకటేరునన్నా తీసుకొచ్చి సూపిత్తాంరా !

కృష్ణ : నిజమేరాకోటి !

కోటి : అందుకేబాబు ! యీ కండవా వొళ్లంతాకప్పి యెత్తుకొత్తాను. నా కట్టుపంచి పిండి యింటి కెత్తుకురారాబీవాఁ !

(కండువా కప్పుతాడు.)

భీమ : యేరే శెప్పాలంట్రా ! యెత్తుకొత్తాలే !

జగ : యింటిదాకా మొయ్యగలవురా కోటి !

కోటి : మొయ్యగలిగే దేంటిబాబు ! ఆపదలో యెట్టా ? పాణంతో శెలగాటం. యింకా యింతదూరవై(నా మొయ్యక తప్పుద్దాబాబు !

కృష్ణ : తొందరగా యెత్తుకోరా కోటి ! వెళ్దాం.

కోటి : (సుందరాన్ని యెత్తుకుంటూ) ఉరేయ్ పుల్లాయ్ ! ఏసు ! జాగర్తగా నా గొడ్డను తోలుకురండిరా ! నే ముందెల్తాను.

పుల్లా
ఏసు } : మేం తోలుకెల్తాంలేరా ! యేరేశెప్పాలా యేం ?

కోటి : (బడిపిల్లలవైపు చూచి) అందరూ నడవండి బాబు ! యెల్దాం.

భీమ : ఉరేయ్ మల్లి ! పిచ్చాడా ! ! యెక్కెయ్యంర్రా గీదల్ని. మనంకూడా పోదాం.

(అందరూ వెళ్తారు.)

**తెర పడుతుంది**

# తీరని రుణం

## 4 రంగం

[తెర లేస్తుంది. ముందు రాజేశ్వర్రావు కృష్ణలు. తర్వాత సుందరాన్నెత్తుకున్న కోటి వస్తారు. వెనకాల రామం, జగదీశ్ మొదలైనవారు వస్తారు.]

కోటి : రాజేశ్వర్రావియ్యగోరు! కుట్నయ్యగోరు! ముందు ఆ మంచం యిటేసి దొడ్డోవుండారేవో. సుందరంబాబు అమ్మ రాజ్జలచ్చుమమ్మగోర్ని పిలవండిబాబు!

కృష్ణ : పట్రా రాజేశ్వర్రావు! మంచంవేదాం. ఒరేయ్ రామం! ఆ యెదురుగుండాగదిలో పక్కలున్నయి తీసుకురారా!

[కృష్ణ రాజేశ్వర్రావులు మంచంపట్టి వేస్తారు. రామం గదిలోకివెళ్లి పక్క తెస్తాడు. రామం రాజేశ్వర్రావులు కలిసి పక్క వేస్తారు. ఆ పక్కమీద కోటిగాడు సుందరాన్ని పడుకోబెడ్తూ వుండగా రాజ్యలక్ష్మమ్మ ప్రవేశం.]

రాజ్య : యేమిటల్లా యీ హడావుడి. (సుందరాన్ని చూచి) యేమయ్యింది నా సుందరానికి? యెవరెత్తుకొచ్చారు?

(తెల్లబోయి చూస్తూవుంటుంది.)

రామం: మేం ముంజికాయలకు పొలంవెళ్తే మావెంట వచ్చాడు.

గోపా : గొడ్డకాడాళ్ల తోటగుంటకాడ చెరువులో స్నానం చేస్తుంటే మేంకూడా దిగి స్నానంచేస్తున్నాం.

కోటి : అసలుకి చెరువులో రోపలకెల్లొద్దని నేను శెప్తూనే వుండా నండి.

జగ : ఇంతలో సుందరం బాగా లోతుకెళ్లి మునిగిపోయాడు. అప్పుడు గబగబా యీ కోటిగాడు చెరువులో దూకి ఒడ్డుకు లాక్కొచ్చి నీళ్లు కక్కించి చలెక్కువైతే బట్టలు కట్టి తీసుకొచ్చాడు.

కృష్ణ : డాక్టర్ని పిల్చుకురమ్మంటావా అత్తయ్యా !

రాజ్య : యెపడీకోటిగాడు ? (మొహంవంక తేరి పారచూచి) వెంకటమ్మగారి పాలేరువంటరా ! అరి మాలచచ్చినాడా ! నా బాబునంటుకున్నావురా రాలినాడా ! నీజిమ్మదియ్య ! నీ కెంతపోయేకాలంవచ్చిందిరా ! (అంతా తెల్లబోయి చూస్తూవుంటారు.)

కోటి : (వినయంగా) ఆపదలోవుంటే .... .... పాణమోసం జరుగుద్దని ....

రాజ్య : ఛీ ! మాలచచ్చినాడ ! (మెటికలు విరుస్తూ) నాబిడ్డకేం ? నూరేళ్లూ బతుకుతాడు. నా బాబుది నిండాయుష్షు. ప్రాణ మోసమంట ప్రాణమోసం ! నా బిడ్డను చచ్చిపొమ్మంట వంటరా కుంగినాడ ! నా బాబు నంటుకున్నదికాక .... నీయమ్మకడుపుమాడ ! నీకుపోయేకాలంరాను. ముందు గడపలుదిగి అవతలికి నడువరారాల్నాడా! (సుందరంపడు కొనివున్న మంచందగ్గరకు వెళ్లి సుందరాన్ని తడుతూ) సుందరం ! నాకన్ననాన్నా ! బాబూ ! సుందరం !

కృష్ణ : స్పృహలేదత్తయ్యా! తొందరగా డాక్టర్ని పిల్చుకు రమ్మంటావా? నారాయణరావుగారా వెంకట్రామయ్య గారా మీ డాక్టరు? యెవరత్తయ్యా?

రాజ్య : అయ్యో నామతిమండ! యీమంచం అంటుకున్నానే! ఆరి మాలచచ్చినాడా! నా బిడ్డ నెత్తుకొచ్చింది కాకుండా నువ్వే పడుకోబెట్టావంటరా కుంగినాడ! నీనోట్లో దుమ్ముపడ. (సుందరంపైన కప్పివున్న నీరుకావి పైపంచె పట్టుకుని) యిదెవరిపంచిరా కప్పారు?

కోటి : నాదేనండి దొరసానమ్మగోరు! సలొచ్చి ఒణుకుతుంటే కప్పానమ్మగోరు!

రాజ్య : ఆరి చచ్చినాడా! అంటుకున్నది కాకుండా నీగుడ్డకూడా కప్పావంట్రా రాల్నాడ! నీ శిరుసు పగల! (అని ఆ పైపంచె తీసి యెడమ చేత్తో అవతల పారేస్తుంది.) యీ కాకీలాగూ యే కుంగినాడిదర్రా తొడిగారు?

కృష్ణ : నాదేనత్తయ్యా! యిదిగో మీ సుందరంలాగూ జగదీశ్ చేతులోవుంది. (జగదీశ్ ఆ లాగూ రాజ్యలక్ష్మమ్మదగ్గర పడేస్తాడు.) చలికి వొణికిపోతుంటే నేనీతుండు కట్టుకుని నాలాగూయిస్తే కోటిగాడు సుందరానికి తొడిగాడు.

రాజ్య : లాగూకూడా తొడిగాడూ దొంగరాల్నాడు! దొరికిందే సందని అన్నీ అంటుకున్నాడు. వీడి శిరుసు వెయ్యి వక్కలుగాను.

రాజే : అదేంటిపిన్ని? కోటిగాణ్ణి అట్లా తిడతావ్? వాడు లేక

పోతే సుందరాన్ని బయటికెవరు తీసేవారు? సమయానికి ఒడ్డుకులాగి బ్రతికించినందుకు సంతోషించక....

రాజ్య : (మధ్యలో) సంతోషించాంలే! సంతోషించాం! మీరు మీయిల్లంతా కలగాపులగం చేసుకుంటున్నారు చాలదూ! అందరూ చేసుకోవాలా? ఒకమాలా? ఒకమండా? మంచాచెడ్డా? (చేత్తో నోరు నొక్కుకొని) అవ్వ! మాలాళ్లే నీళ్లతేవడం! వాళ్లే కుండలు తోమడం! పక్కలెయ్యడం! శుద్ధా? శుభ్రమా? బ్రతికెందుకు? మాలా మండీ అంతా యేకమయ్యాక.

రామం : సుందరానికి చలివేస్తున్నది. ఒణికిపోతున్నాడు పెద్దమ్మా!

రాజ్య : (సుందరంవైపు చూచి) అయ్యో! నా బిడ్డ గడగడలాడిపోతున్నాడే (అని గబగబా యింట్లోకివెళ్లి యిస్త్రీ దుప్పటి తెచ్చి కప్పుతూ) అయ్యో నామతిమండ! యీ మాలచచ్చినా డంటుకున్నపక్క నంటుకుని యింట్లోకెళ్లి యిస్త్రీ బట్లపెట్టి అంటుకున్నానే! పాపిష్టిదాన్ని! ఆ పెట్టెలోనే పట్టుచీరకూడా వున్నట్టుంది. (కోటివైపు చూచి మెటికలు విరుస్తూ) యేనాడూలేదు. చచ్చినాడ! నీ పేరు మీద నాయిల్లూ వాకిలీ అంతా మాలకొంప చేశావు. (గట్టిగా వుమ్మేస్తూ) త్ఫూ! నీ జిమ్మడ! చూడు యెట్లాచూస్తున్నాడో గుడ్లెట్టుకుని! ఫో చచ్చినాడ! అవతలికి ఫో!

(కోటిఖిన్నుడై కండువా తీసుకుని వెళ్లిపోతాడు)

రాజ్య : (బడిపిల్లలతో) వెళ్లండర్రా మీరంతా. వెళ్లండి. విర వాకం చేశారు. చదువూలేక చట్టుబండల్లేక పొలాలట్టుకు తిరుగుతున్నారు. నడవండి !

(పిల్లలు యెవరికివారు మాట్లాడకుండా వెళ్తారు.)

రాజ్య : (సుందరం మంచందగ్గర కూర్చొని) బాబూ సుందరం ! లెక్కలు చేసుకుంటానని పుస్తకాలు పట్టికెళ్లావుగదరా బాబు ! యేచచ్చినాళ్లు మాయచేసి తీసుకెళ్లార్రానిన్ను ! మాట్లాడవేరా (సుందరాన్ని కదిలిస్తూ) నాన్నా ! సుందర ! నాకన్నతండ్రీ ! అయ్యో నాబాబు మాట్లాడ్డం లేదే ! డాక్టర్నెవరు తీసుకొస్తారిప్పుడు ? పిల్లల్నందర్నీ పొమ్మన్నానే ! (నెత్తిమీద కొట్టుకుని) యిదంతా నా ఖర్మ ! యీయనైనా రాకూడదూ ! ఇదిగో రేపొస్తా నన్నమాట. మూడురోజులైంది. యింకారాలేదు. (సుందరంవైపు చూచి) నాబాబు మరీవొణికిపోతున్నాడు. (కాళ్లు పట్టుకుచూచి) అయ్యో కాళ్లు చల్లబడిపోతున్నాయే ! డాక్టర్నెవరు తీసుకొస్తారు ! (కళ్లవెంట నీళ్లు కారుతుంటాయి. గద్గద కంఠంతో) నాన్నా ! సుందరం ! ఇటు చూడు ! నావంక చూడవునాన్నా ! అయ్యో నాకేం ఖర్మొచ్చిందిరాదేవుడా ! (బిగ్గరగా) మంగమ్మక్కా ! మంగమ్మక్కా !! మంగమ్మక్కా !!!

(అంటూ గబగబా వెళ్తుంది.)

తెర పడుతుంది

# తీ ర ని రు ణా లు

## 5 రంగం

[తెర లేస్తుంది. రాజ్యలక్ష్మమ్మ యింటివసారాలో మంచం. మంచంమీద సుందరం స్మృతితప్పి పడి వుంటాడు. ప్రవేశం రాజ్యలక్ష్మమ్మ.]

రాజ్య : (సుందరం మంచందగ్గర కూర్చొని) అయ్యో ! దేవుడా ! నాకేంగతి పట్టిందిరా ! ఒక్కగానొక్క బిడ్డైనందుకు ఆపదొస్తే డాక్టరన్నా లేకపోయాడే ! నాన్నా ! సుందరం ! బాబు ! సుందరం ! మాట్లాడవేరా ! అదుగో మీనాన్నొచ్చారు చూడుబాబు ! కళ్లుతెరువు ! నావైపు చూడు నాన్నా ! చూడవు ! మీ నాన్నొచ్చార్రాబాబు ! (లేచి యింట్లోకిపోతూ) యీయ నింకారాలేదు ! సమయానికి దేవుడులాగా రాకూడదూ ! యిదంతా నా ఖర్మ ! యేనాడు చేసుకున్న పాపమో యివ్వాళిట్లా యేడిపిస్తోంది.

(అని ఖంగారుగా యింట్లోనుంచి వసారాలోకి వసారాలోనుంచి యింట్లోకి తిరుగుతూవుంటుంది. ఇంతలో లీలాదేవి, కాంతమ్మ, కృష్ణ ప్రవేశం)

లీలా : ఏవిటి రాజమ్మొదినా ! సుందరం చెరువులో మునిగి పోయాడంటగా. అప్పుడు కృష్ణుడొచ్చి చెప్పేదాకా తెలుగు విశ్వవిద్యాలయం తెలవనే తెలవదు.

రాజ్య : యేచచ్చినాళ్లో పొలం తీసికెళ్లారంట అక్కడ చెరువులో స్నానం చేస్తూ మునిగిపోయాడంట. రా కాంతమ్మక్కా! కూర్చో! (అని చాప తెచ్చి వేస్తుంది)

కాం : కూర్చోడాని కేంలే ముందు పిల్లాడి సంగతి చూడమ్మా!

(అని చాపమీద కూర్చుంటుంది.)

లీలా : (సుందరం దగ్గరకెళ్లి మంచంమీద కూర్చొని) సుందరం! సుందరం! బాబూ! సుందరం! పలకడంలేదే!

కృష్ణ : యింకా స్మృతిరాలేదమ్మా! డాక్టర్ని తీసుకొస్తానంటే రాజ్యం అత్తయ్య మాట్లాళ్లేదు.

రాజ్య : (ఆశ్చర్యంగా) అయ్యోదినా! నావే మాలగుడ్డలనుకుంటే నువ్వుకూడా మంచాన్నంటుకున్నావా! (గడ్డాంక్రింద చెయ్యి పెట్టుకుని) వెంకటమ్మగారి మాలచచ్చినాడు కోటిగా డెత్తుకొచ్చి పడుకోబెట్టాడొదినా!

లీల : అంటుకుంటే ఫర్వాలేదులే! డాక్టరుగారొచ్చారా? మందిచ్చారా? (మంచంమీదనుంచి లేచి యివతలికి వస్తుంది.)

రాజ్య : లేదు లీలొదినా! యిదుగో రేపొస్తానన్నమాట. మీ అన్నయ్య వూరెళ్లి మూడురోజు లయ్యింది. యింకా రాలేదు. మంగమ్మక్కాయిని వెళ్లి డాక్టరుగార్ని పిల్చుకు రమ్మంటే వెళ్లొచ్చింది. నారాయణరావుగారు లేరంట. వాళ్ల మనవరాలి పెళ్లైతే కాకినాడ వెళ్లారట. యేం చెయ్యాలో తోచడంలేదు. (కళ్లవెంట నీళ్ల పెట్టు

కుంటూ) బిడ్డేమో మాటా పలుకూలేకుండా పడున్నా
డొాదినా !

లీల : ఛా! యేడుస్తావెందుకు ? పూరుకో! అదే తగ్గుతుంది. వెంకట్రామయ్యగారికి కబురు పెట్టకపోయావా ? ఆయన వూళ్లోనే వున్నట్టున్నారు.

కాం : నిజమేనమ్మాయ్ ! వుళ్లోనేవున్నారు. ప్రొద్దున్న ఆవీధిలో సైకిలుమీద వెళ్తుంటే చూశాను. కబురు పంపు. యిప్పు డెవరెళ్తారు ?

రాజ్య : వెంకట్రామయ్యగా రెవరు ? వాడా రావఁడు ? యెల మందులు కొొడుకేగా ! ఆ మాలకుంగినాడిమందే ! వాడొొచ్చి నాబిడ్డను చూడ్డమే !

లీల : అదేవిఁటి రాజమ్మొదినా అట్లామాట్టాడతావ్ ? నీ దంతా చాదస్తం కాకపోతే !

రాజ్య : చాదస్తం యేవుందొాదినా ! యీావూరే ! యెలమందులు కొొడుకే ! యింటింటికి తిరిగి చందా లేయించుకొొని చదివించాడు. చిన్నప్పుడు రావఁడు రావఁడు అనేవాళ్లం. యిప్పుడు వెంకట్రామయ్యగా రైపోయాడు. గారంట గారు. ఏంపోయేకాలమమ్మ ! పోయేకాలం ! కలికాలం !

లీల : (ఆశ్చర్యంగా చూస్తూ) అదేవిఁటొాదినా అలాఅంటావ్ ! మావాడిపేరు కృష్ణమోహన్ అయితే కృష్ణా అని పిల్చుకోడంలా ! మీ సుందరంపేరు సుందర రామారావైతే సుందరం అని పిల్చుకోడంలా ! అలాగే వాళ్ల

బ్బాయి పేరు వెంకట్రామయ్య అయితే చిన్నప్పుడు రావుడు అని పిల్చివుంటారు. దాందేముందిలే!

కాం : మా అమ్మాయి పేరు వెంకాయమ్మైతే ముద్దుకి వెంకూ అని పిల్చుకోడంలా!

రాజ్య : ముద్దంట ముద్దు. మాలచచ్చినాడిక్కూడా ముద్దే!

లీల : ఛా! అలాఅంటావేమిటొదినా! కాకిపిల్ల కాక్కి ముద్దు. దానిదేముంది. ఒరేయ్ కృష్ణా! నే చెప్పానని చెప్పి వెంకట్రామయ్యగార్ని ఉన్నవారి నున్నట్టుగా తీసుకురా! యిక్కడున్నట్టురావాలి!

కృష్ణ : ఒక్కడుగులో వస్తానమ్మా! (కృష్ణ పరిగెత్తుతాడు.)

రాజ్య : (బిగ్గరగా) కృష్ణా! ఒద్దుబాబు! ఆ మాలచచ్చినాడి మందు నా బాబుకొద్దు.

లీల : (బిగ్గరగా) నీకెందుకు నువ్వెళ్లిరారా కృష్ణా! (రాజ్యలక్ష్మమ్మతో) నీకేమైనా మతిపోయిందా వొదినా! అట్లా తిడతావే! గుణాన్నిబట్టి గౌరవించాలిగాని కులాన్ని బట్టికాదు. మొన్న జిల్లాకలక్టర్‌గా రొచ్చారంటే కులానికి మాలే అయితేనేం యెంతమంది ఆయనికి నమస్కారాలు చెయ్యలేదు! టీపార్టీలివ్వలా! యింతెందుకు? మనూళ్ళో బడిపిల్లలందరికి బహుమతులు పంచిపెట్టింది ఆయనేగా! సుందరానికి అద్దం దువ్వెనా వచ్చాయని అప్పుడెంతో చెప్పుకుని మురుసుకున్నావు. మరచిపోయావా! ఆ అద్దం దువ్వెనా ఆయన చేత్తోయిచ్చినవి

కావూ ! సుందరం తెచ్చిస్తే నువ్వింట్లో పెట్టి దాచుకోలా ! యేదో ఆటలో గెల్చాడని ఐసీను బహుమానం యిస్తే దాచిదాచి తొడిగావే! యెడంచేత్తో పారెయ్యలేక పోయావే !

రాజ్య : ఆ మాటకేంగాని వొదినా ! నామనస్సు మాలాడనగానే వూ .... ఫీకుతుందొదినా ! యేదో పాపం చేస్తున్నట్లే వొళ్లంతా జెర్లుపాకుతున్నట్టే వుంటుంది.

కాం : ఆపదలోకూడా యేంటమ్మా ! నీదంతామరీయిది. మొన్న టికి మొన్న ఆ పంచాంగం శాస్తుర్లుగారు కూతురింటికి వెళ్లొస్తూ నిమ్మకూరు డొకిప(రుసందున వడకొట్టి దప్పికై పడిపోయాడంట. యెవడో మాదిగాడు ముంతతో నీళ్లు తెచ్చి మొహానకొట్టి యిన్నిగొంతులో పోస్తే తెప్పరిల్లా డంట. నీకు తెలవదూ అగ్రహారంలో బ్రాహ్మలంతా ప్రాయశ్చిత్తం చేసుకొమ్మంటే వరసపెట్టి అందరి సంగ తులు కడిగొదిలిపెట్టాడు.

లీల : ఆపదలో కాకపోతేమాత్రం మాలాళ్లని మాదిగాళ్లని దూరంగా వెలేస్తామా ? అలా వెలెయ్యడమే జరిగితే మనమే వాళ్లనుండి వెలికావడమన్నమాట. అంటే మనమే మాలవాళ్లమైపోతున్నామనికాదూ !

రాజ్య : ఛీ! ఛీ! అదేంమాటొదినా ! మనమే మాలాళ్లమా !

లీల : నిజంగా. మనం వాళ్లను తక్కువవాళ్లగా చూస్తున్నా మంటే మనం మరింతగా తక్కువవాళ్ల మైపోతున్నా

మన్నమాట. మొన్న శనివారమ్మేగా శివాలయంలో రామకృష్ణ భాగవతార్‌గారు భక్తనందనార్ హరికథ చెప్పితే ఆ సాంతం విన్నొచ్చావుగా. నందనార్‌ని మాలవా డని తిట్టి తర్వాత చెంపలు వాయించుకున్నవాళ్లు లేరూ! గుణంలోనే వుందిగాని కులంలో యేంవుందివొదినా! గుణం మాల కాని కులం మాలకాదు. నా గుణం మాల గుణమైతే నేనే మాలదాన్నవుతాను.

రాజ్య : యింతగా చెబుతున్నావొదినా! యీ కులాలన్నీ వూరికే పుట్టాయంటావా?

లీల : వూరికే పుట్టలేదు. యెవరో కొందరు స్వార్థపరులు కేవలం తమ పెత్తనం చెలాయించుకోడానికై యీ కులాలంటూ సృష్టించారు. మూఢనమ్మకాలు ప్రవేశ పెట్టారు. వాటిని పట్టుకునే వేళ్లాడుతున్నారు నీబోటి వాళ్లంతా! నువ్వే ఆలోచించుఒదినా! యివ్వాళ ఆ కోటి గాడే లేకపోతే — ఒక్కగాను ఒక్కకొడుకు — అల్లారు ముద్దుగా అరచేతుల్లో పెంచుతున్నావే! నీ సుందరం నీకు దక్కేవాడేనా! ఆ చెరువులో మునిగిచస్తే దిక్కా దివాణమా! లబో దిబోమని మొత్తుకోడం తప్ప నువ్వూ నేనూ యేంచేశేవాళ్లం. (ఇంతలో రాజ్యలక్ష్మమ్మ భర్త సుబ్బారావువచ్చి నిల్చుంటాడు. సుబ్బారావు రావడం చూచి కాంతమ్మ లేచి నిల్చుంటుంది.) అక్కడా యిక్కడా కాదే! గబుక్కుని పరుగెత్తడానికి. యెక్కడో

పోలానాయె !. నిజంగా కోటిగాడు నీకూ మా అన్నయ్యకూ పుత్రభిక్ష పెట్టాడొదినా ! (రాజ్యలక్ష్మమ్మ కళ్లనీళ్ల పెట్టుకుంటుంది.) అందుకు వాణ్ణి గౌరవించి మర్యాద చేసి సంతోషంగా పంపడానికి మారుగా నా బిడ్డ నెందు కంటుకున్నావ్ చచ్చినాడా ! అని నానాతిట్లు తిట్టి వెళ్ల గొడతావా ! నీకు వాడుచేసిన వుపకారానికి వాడికి నువ్వు చేసే ప్రత్యుపకారం యిదేనా వొదినా ! ఒక్కగాను ఒక్కబిడ్డను బ్రతికించి పెట్టాడే వాడికి నువ్వేం వుపకారం చేస్తే యెన్నెన్ని వుపకారాలు చేస్తే వాడిరుణం తీరు తుంది ? ఆ డాక్టరుగార్ని కూడా మాలాడంటూ తిడ్తు న్నావే ! నీది యెంతచాదస్తం కాకపోతే ఆ మాలచచ్చి నాడి మందు నా బిడ్డ కొద్దంటావు ? నే కృష్ణుణ్ణి పంపాను కాబట్టి సరిపోయింది. యెక్కడో తోటగుంటకాడ మునిగి పోతే అక్కడనుంచి యిక్కడికి మోసుకురావడాని కెంత సేప్పడుతుంది ? కోటిగాడు తీసుకొచ్చి యెంత సే పయ్యింది ? దాదాపు వాడు మునిగిపోయి నాలుగ్గంటలు కావస్తూందే ! నాలుగ్గంటల్నుంచి మాటా పలుకూ లేకుండా పడివున్నాడే బిడ్డ ! యేంప్రమాదం జరుగు తుందోనని ఆలోచించనక్కర్లా ? ఆ మాలాడిమందు నా బిడ్డ కొద్దని చేతులారా కొడుకును చంపుకుంటావా ! చాదస్తా నికి అంతూ పొంతూ లేదూ !

రాజ్య : (కళ్లనీళ్లు తుడుచుకుంటూ) మాలాడనే మాపేగానీ నాకంత ఆలోచన పోలేదొదినా !

సుబ్బా: యేమిటమ్మాయ్ ! లీలా ! సుందరం పడుకున్నాడే ?

లీల : (బయటికి చూచి) అదుగో డాక్టరుగారు కృష్ణణ్ణి సైకిలు మీద యెక్కించుకొస్తున్నారు.

సుబ్బా: (వెనక్కు తిరిగి నాలుగడుగులు వేసి) ఓహో ! వెంకట్రామయ్యగారా ! రండి ! రండి ! ! (రాజ్యలక్ష్మమ్మ వైపు చూచి) యింట్లో పడక్కుర్చీ త్వరగా తేవే !

[రాజ్యలక్ష్మమ్మ పడకుర్చీ తెచ్చి సుందరం మంచం దగ్గర వేస్తుంది.]

డాక్ట : (కుర్చీలో కూర్చొని సుందరం పొట్టనొక్కి చూస్తూ) నీళ్లు బాగా తాగాడా ? యేమైనా కక్కించారా ?

రాజ్య : (మెల్లిగా) యేమోనాకు తెలవదండి (లీలాదేవి రాజ్యలక్ష్మమ్మ మొహం చూచి నవ్వుతుంది.)

కృష్ణ : తాగాడండి డాక్టరుగారు ! కోటిగాడు పొట్టనొక్కితే కొన్ని నీళ్లు కక్కాడు. యింకా కడుపులో వున్నయ్యో లేవో మరి మాకు తెలవదు.

డాక్ట : యింకా లోపల నీళ్లున్నవండీ సుబ్బారావుగారు ! మందిస్తాను. ఆ నీళ్లు మూత్రంద్వారా వెళ్లిపోతాయిలెండి. కుర్రాడు భయపడిపోయాడు. (లేచి నిల్చొని) ఇతన్ని తెల్లవారేదాకా యెవ్వరూ పలకరించొద్దు. అలాగే పడుకోనివ్వండి. యిప్పుడేమీ చలిలేదు. మళ్లీగనక వస్తే వేరే

బిళ్లలిస్తాను. ఆ బిళ్లలు గంటకొకటి చొప్పున వెయ్యండి. మందుకు సీసా పట్టుకుని మీ రొస్తారా సుబ్బారావు గారూ !

సుబ్బా: నేనూ యిప్పుడే వూరునుంచి వచ్చానండీ ! మీ వెనకాలే వస్తాను.

లీల : నువ్వెందుకన్నయ్యా ! డాక్టరుగారి సైకిలుమీదనే కృష్ణ డెళ్లి మందు తెస్తాడులే ! సీసాఒకటి త్వరగా కడిగియ్యి వొదినా !

కృష్ణ : నే వెళ్తాలే మామయ్యా ! నువ్వెందుకు ?

డాక్ట ! త్వరగా రాబాబు ! వీధిలో నుంచుంటాను.

(వెళ్తాడు. డాక్టర్ తోపాటు సుబ్బారావు కూడా వెళ్తాడు. రాజ్యలక్ష్మమ్మ సీసా తెచ్చిస్తుంది. అది తీసుకొని కృష్ణ వెళ్తాడు. అనంతరం తిరిగి సుబ్బారావు ప్రవేశం)

సుబ్బా: యేంజరిగిందమ్మా ! లీలా !

లీల ; ఆ....యేమీలేదన్నయ్యా ! వెంకటమ్మగారి పాలేరు లేడూ ! కోటిగాడు (మధ్యమధ్య సుబ్బారావు ఊఁ కొడుతుంటాడు.) వాడు లేకపోతే యివ్వాళ మన సుందరం మనకు దక్కేవాడు కాదు. ముంజికాయలుకని వెళ్లి తోటగుంటకాడ చెరువులో గొడ్డకాడాళ్లతో స్నానం చేస్తూ మునిగిపోయాడంట. కోటిగాడు చూచి చెర్లోదూకి బయటికితీసి నీళ్లు కక్కించి బుజానేసుకుని యింటి కెత్తు

కొ_స్తే మబ్బాయి నంటుకున్నావా చచ్చినాడా అని మా వొదిన అడ్డమైనతిట్లు తిట్టిందట.

సుబ్బా: యిదెప్పుడూ యింతేనమ్మా ! యెన్నిసార్లు చెప్పినా బుద్ధిరాదు. ఆ అవధాను లొకడు దొరికాడు బోధలు చెయ్యడానికి. అతగాడేమో ఆడవాళ్లను చేర్చి నాలుగు మాటలుచెప్పి డబ్బులు సంపాదిస్తూ యిప్పటికి నాలుగై దెకరాలు కొన్నాడు. అవధాన్లు చెప్పడాని కిన్నికబుర్లు చెప్తాడేగాని ఆయనల్లుడు రంగధామరావు అవధాన్లు కూతురు ఆరోగ్యం మంచిదికాదని ఒక బి. ఏ. ప్యాసైన మాలమ్మాయిని ప్రేమించి రిజిష్టర్డ్ పెళ్లి చేసుకోలా ? యిద్దరూ ఒకాఫీసులోనేనంట వుద్యోగం. పండగలకని పబ్బాలకని చీటికి మాటికి తన కూతురు అల్లుడు వస్తుంటే యింట్లో కలుపుకోడంలా ! అవతలికి పొమ్మని గెంటేస్తున్నాడా ?

కాం : నిజమే లీలొదినా ! నువ్వప్పుడు వూళ్ళో లేవనుకుంటా. మీ అక్కగారి వూరెళ్లినట్టున్నావు. అప్పుడు వూరంతా చెప్పుకున్నారు. అవధాన్లుగారి అల్లుడు యెవరో మాల పిల్లను పెళ్లి చేసుకున్నాడంటని.

రాజ్య : నేనూవిన్నాను కాంతమ్మక్కా ! అయితే యేదో భక్తు డనే ధోరణిలో పడ్డానేకాని యివన్నీ యిట్లాకూడాబలుకోవాలని తోచనేలేదు. (సుబ్బారావువైపు చూచి) యెల్లుండి

సుందరం పుట్టినరోజు పండుగ. ఆనాటికి బాగా కులాసా చిక్కి లేచి తిరుగుతాడని డాక్టరుగారు చెప్పారా?

సుబ్బా: యీ రాత్రంతా కాస్త జాగ్రత్తగావుండి తెల్లవారితే రేపు మధ్యాహ్నానికల్లా మామూలు మనిషవుతాడని చెప్పారు.

రాజ్య : అదేచాలు నా బిడ్డకు. యీ సారి పండగ మరింత బాగా చేసుకోవాలి.

లీల : యిప్పటికైనా చేసినతప్పు తెల్సుకున్నావా వొదినా?

రాజ్య : యిన్నిసార్లు చెప్పాలా! నామతిమండ!

లీల : ఇదిగో ఒదినా! రేపు పుట్టినరోజు పండుగనాడు కోటిగాడికి కబురుపంపి సుందరంతోపాటు తలకు నీళ్లుపోయించి కొత్తబట్టలు కట్టబెట్టి శుభ్రంగా పిండివంటల్తో భోజనంపెట్టి పంపు. మేమూ సంతోషిస్తాం. కోటిగాడూ సంతోషిస్తాడు. నువ్వు అన్నితిట్లు తిడితే యెంతబాధ పడ్డాడో పాపం!

రాజ్య : ఆ కోపంలో యెన్ని తిట్టానోవొదినా! యిప్పుడు తల్చుకుంటే కడుపు తరుక్కుపోతోంది.

లీల : అందుకే నేచెప్పినట్లు పాతికరూపాయలైతే అయినై కోటిగాణ్ణి పిలిపించి ఆ పని చెయ్యి.

రాజ్య : అట్లాగే చేస్తానొదినా! యిదిగో లీలొదినా! కాంతమ్మక్కా! మీ రిద్దరూ యింటిల్లపాదీ యెల్లుండి మా యింట్లోనే భోజనం.

లీల : భోజనాని కేమొచ్చిందిగాని యికముందు మాలామండీ అనీ అంటనీ సొంటనీ అయినదానికి కానిదానికి యెవర్నీ తిట్టబాకు. సుందరానికి ఒణుకులొ_స్తే కోటిగాడు పైపంచె కప్పి తీసుకొచ్చాడని యిల్లంతా మాలకొంపయ్యిందనీ తిట్టావంట.

సుబ్బా: దీని ఆచారమంతా మండింది. రోజూ నేను కాఫీహోటలు కెళ్లి రావడంలా ! ఆ హోటల్లో ఒక కులమేంటి అందరూ వుంటారు. ఒకర్నొకరు రాసుకుంటూ తిరగడంలా ! ప్రొద్దునో మధ్యాహ్నమో రోజూ యెక్కడో ఒకచోట అంటుకుంటూనే వుంటాను. యింట్లోకి వస్తూనే వుంటాను. నేనిట్లా తిరుగుతుంటే 'దీ నాచారం యేమయ్యిందంట !

లీల : యింక వూరుకోవే అన్నయ్యా ! యిప్పుడు తెల్సుకుందిగా !

సుబ్బా: ఊ .... ఉ .... తెలిసిందంట తెలిసింది. అరె ! బిడ్డను బ్రతికించాడనే ఆలోచనైనా లేకపోతే !....

రాజ్య : (కళ్లనీళ్లు పైటకొంగుతో తుడుచుకుంటూ) తప్పైపోయింది. మాడిందాన్ని. వెనకాముందూ లేకుండా వాగాను. డాక్టరుగార్ని కూడా ఆడిపోశాను.

లీల : (ప్రక్కకు చూచి) అడుగో కృష్ణ వచ్చాడు. ముందా మందు తీసుకుని ఔన్సుగ్లాసులో పోసి తాగించాదినా !

(ప్రవేశం కృష్ణ. మందుసీసాతో)

కృష్ణ : యిదిగో అత్తయ్యా ! యీ సీసాలో మందు రెండు గంటల కొకసారి ఔన్సుకాడి కిమ్మన్నారు. (జేబులోంచి

చిన్న పొట్లాంతీసి) యివిగో బిళ్లలు చలొచ్చినప్పుడే సేవి. (సీసా మందుపొట్లాం రాజ్యలక్ష్మమ్మ కిస్తాడు.)

రాజ్య : మా బాబే ! కష్టపడి రెండుసార్లు తిరిగాడమ్మ ! బిడ్డ !

(ఔన్సుగ్లాసులో మందు పోసి సుందరం గొంతులో పోస్తుంది. అందరూ సుందరందగ్గర కెళ్తారు.)

లీల : యీ రాత్రంతా జాగ్రత్తగా చూడాలొదినా ! అన్నయ్యా ! మరి వెళ్లివస్తాం ! యిప్పటికే చీకటి పడినట్టుంది.

రాజ్య : కూర్చోనైనా కూర్చోలేదు. వచ్చి నిల్చున్నదానివి నిల్చున్నట్టే వున్నావు. మళ్లీ రేపొకసారి రావొదినా ! కాంతమ్మక్కా ! నువ్వుకూడారా !

లీల } కాం } : అట్లాగే వస్తాంలే !

(లీలాదేవి కాంతమ్మ కృష్ణ వెళ్తారు. రాజ్యలక్ష్మమ్మ సుబ్బారావులు. నాలుగడుగులువేసి సాగనంపి వెనక్కి వస్తారు.)

(తెరలోంచి లీలాదేవి గొంతు బిగ్గరగా)

రాజమ్మొదినా ! యెల్లుండి సుందరం పుట్టినరోజు పండుగ భోజనాలకు డాక్టర్ వెంకట్రామయ్యగారిని కూడా పిలవండే !

రాజ్య : (ధ్వనివచ్చేవైపు తిరిగి బిగ్గరగా) నేనూ అదే అనుకుంటున్నాను లీలొదినా ! ఒక్క భోజనమేకాదు బట్టలు కూడా పెడతాం ! (సుబ్బారావువైపు తిరిగి) యేమండీ !

వచ్చిరావడంతోటే యీ గొడవలో పడ్డట్టున్నారు! కాళ్ళైనా కడుక్కున్నట్టులేదు. రండి! దొడ్లోకి కాళ్ల కడుక్కుందురుగాని ....

సుబ్బా: యీ మంచం వసారాలోనే నేంటి? పట్టు లోపలపెడదాం. మరీ చలిగాలి వేస్తోంది.

రాజ్య: బిడ్డసంగతి మర్చేపోయాను. నా మతిమండ. తోచనైనాలేదు.

(యిద్దరూ సుందరం, పడుకున్న మంచం లోపలకు పడతారు.)

తెర పడుతుంది

# త్రిరసిరు ణం

## 6 రంగం

[క్లాస్‌రూం. ఒకకుర్చీ వుంటుంది. రామం, రాజేశ్వర్రావు, కృష్ణ మరికొందరు పిల్లలుంటారు. నల్గురాడపిల్లలు కూడా వుంటారు. తెర లేచిన ఒక నిమిషానికి మూడ్సో పిరుడు అయినట్లు బెల్ వినపడుతుంది. తర్వాత మాష్టారు రాగానే పిల్లలంతా లేచి నిల్చుంటారు.]

మాష్టా: (కుర్చీలో కూర్చొని) ఊఁ .... కూర్చోండిరా ....
కూర్చోండి : (పిల్లలు కూర్చుని గుసగుస లాడుతూ వుంటారు.)

మాష్టా: ఉష్.... మాట్లాడకండిరా ! తియ్యండి పాఠం. యేమిటిరా యీవేళ కృష్ణా !

రామం: యివ్వాళ పాఠం కాదండీ పద్యాలండీ !

మాష్టా: పద్యాలట్రా యివ్వాళ ?

కృష్ణ : అవునండీ ! మొన్ననే మహాత్ములు పాఠం చెప్పారు.

విద్యార్థి: మొన్న మీరు సెలవు పెట్టినప్పుడు వెంకటేశ్వర్రావు మాష్టా రొచ్చి అప్పచెప్పుకున్నారు కూడానండీ !

మాష్టా: ఒరేయ్ ! నాగు ! నువ్వప్పచెప్పురా పద్యం !

నాగు : (లేచి నిల్చుని) రంగు మార్చుచుండు రాజకీయజ్ఞుండు
భంగపుచ్చి ప్రజలగంగ గలిపి

విద్యా : మాష్టారండీ ! ఆ పద్యం కాదండీ ! అదెప్పుడో అయిపో యిందండీ !

కృష్ణ : అది మీరు చెప్పిన పద్యాల్లోదండీ ! అవన్నీ యిదివరకే శాస్త్రిగారు అప్పచెప్పుకుని కొత్తపద్యాలు చెప్పారండీ !

మాష్టా: యేపద్యం దగ్గర్నుంచి యేపద్యందాకా చెప్పార్రా !

రాజే : తెగువజంపి అనే పద్యందగ్గర్నుంచి కులము లేకమాట అనే పద్యందాకా చెప్పారండి !

మాష్టా: (పేజీలు తిప్పి) యేడు పద్యాల్ చెప్పార్రా !

రామం: శనాది వారాలు వచ్చాయని మేమే చెప్పమన్నామండి మాష్టారూ !

మా : ఒరేయ్ నాగు ! అప్పచెప్పరా ! కులవిభేదమనెడి.

నా : నాకు రాదండి !

మా : యేం ? యెందుకని ?

నా : ఆవాళ నేను లేనండి ! మూడో పిరుడ్లో తల నొప్పిగా వుంటే మాష్టార్నడిగి యింటి కెళ్లిపోయానండి !

మా : యింటికెళ్తే ! యేంపాఠం జరిగిందో తెల్సుకుని చదువుకు రావాలి. యెవడో ఒకడు మానేస్తే పాఠం చెప్పకుండా ఆపుతార్రా ? మాట్లాడవేం ?

నా : ఆపరండి !

మా : ఆపరని తెల్సుగదా ! యెవర్నన్నా అడిగి యేంపాఠం చెప్పారో యెందుకు తెల్సుకోలా ? యికనుంచి నే నావాళ

రాలేదండీ! అని యెవరైనా సమాధానం చెప్పారా తాట వొలిచేస్తాను. జాగ్రత్త. కూర్చో! (నాగు కూర్చుంటాడు.) నెక్స్ట్!

విద్యా: (లేచి) ఏపద్యమండీ!

మా : కులవిభేదమనెడి

విద్యా: కులవిభేదమనెడి బలిపీఠిసన్నిధి
నరుడె నరునిపట్టి నరుకుచుండు
క్రూరుడౌను నరుడు కులతత్వమున్నచో
వాస్తవమ్ము నార్లవారి మాట

మా : కూర్చో! నెక్స్ట్! కులము తక్కువనుచు

విద్యా: (లేచి) కులము తక్కువనుచు చులకన చేయగా
కర్ణు నంత వాడె కత్తికట్టె
కుల విబేదమందె

మా : విబేదం కాదురా వెధవాయ్! విభేదం!

విద్యా: కుల విబేదమందె

మా : విబేదం కాదురా రాస్కెల్! విభేదం! భే! భే!

విద్యా: భే! భే! విభేదం

మా : ఊఁ .... యేడువ్ తర్వాత ....

విద్యా: కుల విభేదమందె కలహ బీజములుండు
వాస్తవమ్ము నార్లవారిమాట

మా : తప్పులు రాకుండా జాగ్రత్తగా చదవాలి. విభేదం అని భే క్రింద మేకు కనపడుతుంటే విబేదం విబేదం అంటా

వేరా ? సరిగా అక్షరాలు చూచి చదివేడుస్తూ వుండు. కూర్చో (కూర్చుంటాడు) నెక్స్ట్ ! యెవర్రా ! వెంకటేశు ! నువ్వప్పచెప్పరా ! సోషలిజము లేదు ....

వెం : (లేచి) సోషలిజము లేదు సోదరత్వము లేదు
కులపిశాచి మంట గలియకున్న
వత్సమెట్లు పెరుగు వ్యాఘ్రమ్మ సరసనే
వాస్తవమ్ము నార్గవారిమాట
(పద్యం చదివి కూర్చుంటాడు.)

మా : కూర్చోమనకుండానే కూర్చుంటావేరా ! (వెంకటేశు లేస్తాడు.) వ్యాఘ్రమంటే యేవింటి ?

వెం : (పెదవులు కదిలిస్తూ తల గోక్కుంటూ వుంటాడు.)

మా : బుఱ్ఱ గోక్కుంటావేరా బడుద్ధాయ్ ! కూర్చునేడువ్. (కూర్చుంటాడు) నెక్స్ట్ ! వ్యాఘ్రమంటే యేమిట్రా అర్థం ?

విద్యా : (లేచి) పెద్దపులండీ !

మా : కూర్చో ! నెక్స్ట్ ! కృష్ణా ! విలువ కట్టరాదు

కృష్ణ : (లేచి నిల్చొని) పద్యాలు నాకు రాలేదండీ !

మా : వాడికేమో తలనొప్పి ! నీకేమొచ్చిందిరా ! అసలు పాఠానికున్నావా ?

కృష్ణ : వున్నానండి !

మా : మరైతే యెందుకు రాలేదు ?

(కొత్తబట్టలు కట్టుకున్న కోటిగాడు సుందరం ఒకరు అరటిపళ్లబుట్ట ఒకరు పంచదార చిలుకలబుట్ట పట్టు కొని వస్తారు.)

కోటి : (నవ్వుకుంటూ) పొంతులుగోరు ! సుబ్బారావియ్యగోరి సుందరంబాబు పుట్టినరోజు పండగంటండి ! యీ పళ్లు పంచదార శిలకలు బళ్లో పిల్లలందరికి పంచిపెట్టమని రాజ్జలచ్చుమమ్మగోరు పంపారండి ! (అని బుట్ట దింపుతాడు సుందరంకూడా దింపుతాడు.)

మా : యేమిటిరా కోటిగా ! ఊళ్లో పెళ్లైతే కుక్కలకు హడావుడని సుందరం పుట్టినరోజైతే నువ్వు కట్టా వెందుకురా కొత్తబట్టలు ?

కోటి : మొన్న సుందరంబాబుగోరు సచ్చి బతికినంతైందండి !

మా : (ఆశ్చర్యంగా) అదేమిటిరా ! యేంజరిగింది !

కృష్ణ : మాష్టారండీ ! మొన్న మేం అందరం ముంజికాయలకని పొలం వెళ్లామండి ! గొడ్డకాడాళ్లతో కలిసి అక్కడ చెరువులో స్నానంచేస్తూ సుందరం మునిగిపోతే యీ కోటిగాడే గభాల్న దూకి ఒడ్డుకి లాక్కొచ్చాడండి. ఆ మర్నాటిదాకా సుందరానికి స్మృతేరాలేదండి !

రాజే : ముందేమో సుందరం అమ్మండీ ! మా అబ్బాయి నెందు కంటుకున్నావురా మాలచచ్చినాడ ! అని నానాతిట్లు తిట్టిందండి కోటిగాణ్ణి.

మా : (ఆశ్చర్యంగా) అరె ! నిజమేనంట్రా ! కొడుకును బ్రతికిస్తే అంత ఆలోచనలేకుండా యెట్లాతిట్టిందిరా !

కృష్ణ : ఆ తర్వాతేమో మా అమ్మవెళ్లి కోప్పడి మాలా మండనీ. అంటూ సొంటనీ అనుకోవడం చాలాతప్పని యేమేమిటో చాలా చెప్పిందండి! మా సుబ్బారావుమామయ్యకూడా వచ్చి కోప్పడ్డాడంటండి! అందుకని మా అత్తయ్య మారిపోయి యీవేళ కోటిగాడికి బట్టలు పెట్టిందండి. నిన్నే సుందరానికి స్మృతొచ్చిందండీ! యేమీ తోచడం లేదంటే సుందరందగ్గరే నిన్నంతా వున్నానండి! అందు కనే పద్యాలు రాలేదండినాకు.

మా : అదన్నమాట అసలుకథ. కూర్చో! (కృష్ణ కూర్చుంటాడు.) అయితే మీకివ్వాళ భోజనాలు లేవేంటి?

కృష్ణ : వున్నాయండి! ప్యాన్ బెల్ కి మా అమ్మ మాష్టార్నడిగి యింటికి రమ్మన్నదండీ!

(సుబ్బారావు పాలేరు నాగేశు తట్టతో వస్తాడు.)

మా : యివేమిటిరోయ్! యిన్ని తట్టలు!!

కోటి : దింపరా నాగేశు! (నాగేశు దింపుతాడు.) అరటిపళ్లు శిలకలు సదువుకునే పిల్లలకండి! గొబ్బరికాయలు బత్తాయిలు పంతుళ్ల కిమ్మన్నారండి!

మా : సరే త్వరగా పంచిపెట్టి వెళ్లండిరా!

కోటి : రాజ్జలచ్చుమమ్మగోరు యీటన్నిటినీ నా శేతిమీనే పంచిపెట్టమన్నారండీ!

మా : సరే నువ్వే పంచిపెట్టు త్వరగా. యెవరైతేనేం?

(ముందు మాస్టారికి కొబ్బరికాయ బత్తాయిలు రెండూ యిచ్చి తర్వాత రెండేసి అరటిపళ్లు – చిలుకలు పిల్లలకు పంచిపెట్టిన తర్వాత కోటితోపాటు సుందరం నాగేశుకూడా వెళ్తారు.)

మా : ఒరేయ్ యీ అంటరానితనం వున్నదే మహాచెడ్డదిరా! మీరు పద్యాల్లో చదువుకోలా?

విద్యా: (పదిమందీ ఒక్కసారిగా) చదువుకున్నామండీ!

మా : బుద్ధుడు, గాంధీమహాత్ముడు మొదలైన గొప్ప గొప్ప మేధావులంతా చెప్పిందే అది.

కృష్ణ : అవునండీ! మొన్న మహాత్ములు పాఠంలో గాంధీగార్ని గురించి చాలా చెప్పారండీ!

మా : గుణాన్నిబట్టిగాని గౌరవించాల్సింది కులాన్నిబట్టికాదు. (ఆడపిల్లలవైపు చూచి) యేదర్రా! మరియమ్మ రాలేదే యివ్వాళ? యెందుకర్రా నాగు?

నాగు : మరియమ్మకి నిన్నట్నుంచి జ్వరమొస్తోందండి!

మా : అయ్యోపాపం! మరియమ్మ చూడండి కులానికి యెవరైతే నేం? ఆ అమ్మాయి కొచ్చినన్ని మార్కులు తెలుగులో కాని యింగ్లీషులోకాని లెక్కల్లోకాని మీ కెవరికొస్తాయి? తెలివిగలవాళ్లు మంచివాళ్లు అందర్లోనూ వుంటారు. వాళ్లొచ్చి మన నూతుల్లో నీళ్లు తోడకూడదని చెరువుల్లో నీళ్లు ముంచుకోకూడదనీ కొందరు ఛాందసు లంటూ వుంటారు. నిజానికి అవన్నీ కష్టపడి తవ్వేదెవరు? అట్లాగే గుళ్లల్లో కెళ్లగూడదంటారు. ఆ గుళ్లన్నీ పునా

దుల్ దగ్గర్నుంచీ కట్టడానికి రాళ్లుమోసి అడుసుమోసి చాకిరీఅంతా చేసేది వాళ్లుకాదూ! మా బావమరిదిగారి వూళ్లో వొకసారి చిన్న గమ్మత్తు జరిగింది. చెప్తా వినండి. మా బావమరిదివున్న వీధిలోనే ఒక శర్మగా రున్నారు.

విద్యా: యేవూరండీ మాష్టారూ!

మా : యిక్కడేరా శంబూకాగ్రహారం అని వుందిలే! ఆ వూళ్ళో — అయితే ఆ శర్మగారింట్లో వాళ్లందరికీ మహాచెడ్డ ఆచారం. వాళ్లదొడ్లో నుయ్యుందిగాని అవి వుప్పునీళ్లనుయ్యి. మంచినీళ్లకని వూళ్ళో మూడు ఫర్లాంగుల దూరంలోవున్న నూతి కెళ్లాల్సివచ్చేది. శర్మగారు గాని, ఆయన భార్యగాని యీడొచ్చిన కూతురుగాని యెవరు మంచినీళ్ల కెళ్లొస్తున్నా దారిలో యేమాలా మాదిగాడో యెదురొరానక్కర్లేదు కళ్లకు కనిపిస్తే చాలు ధబుక్కుని ఆ బుజంమీది బిందెడు నీళ్లూ పారబోసి ఆ కనపడ్డ కడజాతివాణ్ణి తిట్టుకుంటూ మళ్లీ తోడుకు తెచ్చుకునేవారు. ఒక్కొక్కరోజు యిట్లా నాలుగైదు సార్లు కూడా పారబొయ్యాల్సొచ్చేది. నీళ్లు తెస్తూ గబగబాన్నా నడిచేవారుకాదు పాపం! అడుగులో అడుగేసుకుంటూ బుజంమీది బిందె ఒకచేత్తో పట్టుకుని రెండో చేత్తో బిందెలోనీళ్లు ముందు రోడ్డుమీద చల్లుకుంటూ నడిచేవారు.

విద్యా: మా చచ్చిపోయిన బామ్మకూడా అలాగే నీళ్లు చల్లుకుంటూ వచ్చేదండి మాష్టారు! లేకపోతే మైలబడి పోతామట!

మా : విననండిరా! వాళ్ల మైలు బద్దలయ్యింది. ఒకనాడు ఆ శర్మగారు వూళ్ళోలేరు. మండే వేసంకాలం. మధ్యాహ్నం ఒంటిగంటకి శర్మగారి కూతురు గదిలో మంచంమీద నిద్రపోతోంది. అమ్మాయి నిద్రపోతోందిగదా అని వాళ్లమ్మ తలుపులన్నీ గడలువేసి ఆ అమ్మాయి పడుకున్నగది తలుపుబైట గొళ్లెంపెట్టి వీధితలుపు కూడా బైటే గొళ్లెంపెట్టి అమ్మలక్కలతో ఉబుసుపోక మాట్లాడ్డానికి పొరుగింటికెళ్ళి కూచ్చుంది. ఇంతలో వాళ్లింటికి యెలాఅంటుకున్నదో నిప్పంటుకుని తగలబడుతోంది. యెవరో చూచి శర్మగారిల్లు తగలబడుతోందని కేకలు పెట్టేసరికి ఆయనభార్య యేడుస్తూ మొత్తుకుంటూ గదిలో నా కూతురు పడుకుంది మొర్రోఅని గోలపెడ్తూ యేడుస్తూంది. నలుగురూ పోగై అయ్యో! అయ్యో! అనేవారేకాని సాహసించి తగలబడుతున్న యింట్లోకెళ్లి ఆ అమ్మాయిని యెవరు తీసుకొస్తారు? అప్పుడే ఆ వీధివెంట కొత్తచెప్పులు కుట్టుకుని మున్సబుగారి కిద్దామని మాదిగ చెంచులు గబగబా వెళ్తూ ఆ కేకలువిని చేతులోవున్న చెప్పులుజత అక్కడే పారేసి ఒక్క దూకుతో గొళ్లాలుతీసి యింట్లోకెళ్ళి యిల్లు తగలబడుతూ యింత

మంది కేకలువేస్తున్నా వాళ్లు తెలియకుండా నిద్రపోతున్న శర్మగారి కూతుర్ని అమాంతంగా చేతులమీ దెత్తి కొచ్చి వీధిలో దింపాడు. చెంచులు సాహసానికి ధైర్యానికి అగ్రహారీకులంతా మెచ్చుకున్నారు. తమ కూతురు బ్రతికిందే పదివేలనుకొని ఆ నాడు మొదలుకుని ఆ శర్మ గారి కుటుంబం అంతా మాలాళ్లన్నా మాదిగాళ్లన్నా యేవగింపు లేకుండా మర్యాదగా మసలడం నేర్చుకున్నారు. రోజు కొకసారైనా చెంచుల్ని తలుచుకొనే వారు. అలాగే మీరంతా తక్కువ కులమనీ యెక్కువ కులమనీ అనుకోకుండా .... మర్చిపోయాను (చేతులో పుస్తకం తిరగవేస్తూ) మొన్నే చెప్పారన్నారుగా పద్యం.

విలువ కట్టరాదు కులగోత్రములబట్టి

(మధ్యలో మొదట యిద్దరు క్రమంగా ముగ్గురు నల్గురు మరికొందరు విద్యార్థులు కూడా మాష్టారుతో పాటు కలిపి చదువుతారు.)

కులము తక్కువైన తులువకాడు
గొప్పరాదు ఋషుల గోత్రజుడైనంత
వాస్తవమ్ము నార్లవారిమాట

మీ రంతా అన్నదమ్ముల్లా వుండాలి. మిమ్మల్నిబట్టే ముందు ముందు మీ పిల్లలుకూడా తయారవుతారు. అసలు మీ పిల్లలకు కులమంటే యేమిటో తెలవకుండా పోవాలి.

కులాలంటే యేమిటో మా అమ్మా నాన్నా చెప్పేదాకా అసలు మాకు తెలవనే తెలవ్వండి. యికనుంచి అన్నీ మర్చిపోతామండి తప్పకుండా.

రామం చెప్పింది నిజంరా! మొదటినుంచీ అంతే జరుగుతోంది. పిల్లలంటే కల్లాకపటం యేమీ యెరుగరు. పసిపిల్లలు చూడండి! యెవరుచేతులు చాచినా యెత్తుకొమ్మని యెగబడతారు. యెవరుగిల్లినా యేడుస్తారు. వీడు మాలనీ వాడు మాదిగనీ వా డెక్కువనీ తక్కువనీ ఆ పసిపిల్లల కేమీ తెలవదు. యెవరైనా నాలుగైదేళ్ల పిల్లలు చొక్కాలవీ తొడుక్కునుండగా యే మాలవాడి దగ్గరకో వెళ్లబోతుంటే వాడు మాలవాడు అంటుకోకుబాబూ! వాడిదగ్గర కెళ్లబాకు అంటూ అమాయకులైన ఆ పిల్లల్ని తల్లిదండ్రులు దురలవాట్లకు మూఢనమ్మకాలకు లోను చేస్తారు. ఖర్మం. చాలక అంటుకున్నారే అనుకోండి ఆ పిల్లల్ని నాలుగు బాది స్నానం చేయించి తొడుక్కున్న గుడ్డలు తడిపించి నానాహంగామాచేసి మాలవాడంటే యేదో ఒక అంటరానివాడని దరిదాపుల్లోనైనా వుండడానికి వీల్లేనివాడని దురభిప్రాయాన్ని వాళ్ల విషకల్మష మైన లేతహృదయాల్లో కల్గిస్తారు. తల్లిదండ్రులు నేర్పే దాకా మాలో మండో పిల్లల కేమీతెలవదు. కాబట్టి

యీ కులాలనీ యెక్కువలనీ తక్కువలనీ మీరేమీ పట్టించుకోకండేం ? యేరా అందరూ మర్చిపోతారంట్రా ?

విద్యార్థులంతా : అందరం మరచిపోతామండీ !

మా : యేదీ మీ రంతా అనండి ! ప్రతిజ్ఞ పట్టండి. గాంధీమహాత్ముడు చెప్పినట్లు

విద్యార్థులు : గాంధీమహాత్ముడు చెప్పినట్లు

మా : మనుషుల్లో యెక్కువ తక్కువల్లేవు.

విద్యా : మనుషుల్లో యెక్కువ తక్కువల్లేవు.

మా : అంటరానితనాన్ని రూపుమాపుతాం.

విద్యా : అంటరానితనాన్ని రూపుమాపుతాం.

మా : అందరూవొకటే ! మానవులంతావొకటే !

విద్యా : అందరూవొకటే ! మానవులంతావొకటే !

(నాలుగోపీరు డయిపోయినట్లు బెల్ వినపడుతుంది.)

మా : అరె ! అప్పుడే పీరుడయిపోయిందిరా ! ప్యాస్‌బెల్లే గదరా !

విద్యార్థులు : అవునండి ప్యాస్‌బెల్లే :

మా : యేదీ కులము లేకిమోట అనే పద్యం అయిపోయిందిగా ! అందరూ చదవండి.

(కృష్ణ నాగు గబగబా పుస్తకం తెరచి చూచి చదువు తారు. తక్కినవాళ్లు చూడకుండా చదువుతారు. మాష్టారు కూడా పుస్తకంచూచి పిల్లల్తోపాటు చదువుతారు.)

కులములేకపోట కలిధర్మమైనచో
సాగుచున్నదిపుడె సత్యయుగము !
సర్వసమయుగమ్మె సర్వోత్తమమ్మురా !
వాస్తవమ్ము నాగ్లవారిమాట.

(పిల్లలు మాష్టారు నవ్వుకుంటూ వెళ్లిపోతారు.)

తెర పడుతుంది

సమాప్తము

